## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050019176

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# విజ్ఞప్తి.

పాఠకమహాశయులారా!

బాలుర కుపయోగముగానుండులాగున నీతియుక్తమగు పుస్తకము నేదేని వ్రాయవలయునని యాసక్తి చాలకాలము నుండి కలదు. కాని తగినసమయము చిక్కినదికాదు. ఈ నడుమ సుభాషితమణి కంఠహారమను పుస్తకము చదువ దటస్థమైనది. దానిలోని శ్లోకములు కొన్ని నీతివిశిష్టములై చాల సొంపుగానుండుటచే 100 శ్లోకములనేరి వానినన్నిటిని సాధ్యమైనంతవఱకు మూలమునకు సరిగానే తెలుగుజేసియున్నాను. వృత్తములుగా వ్రాసినయెడల బాలురకు జదువ గష్టముగా నుండుననుతలంపుతో నన్నియు గీతపద్యములుగానే చేసియున్నాను.

ఉ. వాసికిఁగాంచినట్టి కవి ♦ వాసవులేనెఱసుల్ వచింప భా
షా సరసీరుహాక్షిపద ♦ సారససేవయొనర్పనట్టి నే
దోసము వీసమున్ గనని ♦ ధోరణిఁ బద్యములల్ల నేర్తునే
వేసటయంచు నెంచక య♦భిజ్ఞులు దెల్పుఁడు దీనదోసముల్

ఇట్లు పండితవిధేయుఁడు,

పెండ్యాల చినవేంకట సుబ్రహ్మణ్యము.

గీ. యార్లగడ్డవంశోద్భవు ♦ డార్యహితుఁడు
తమ్మయాభిఖ్యుఁ డెంతేని ♦ నెమ్మితోడ
దీని నచ్చువేయించెను ♦ గాన దేవుఁ
డితని కాయురారోగ్యంబు ♦ లిచ్చుగాత !



శుభమస్తు.

శ్రీశారదాంబాయైనమః

# నీతిగీతిముక్తావళి.



## మహాజనప్రశంస.

గీ. పరులకుపకృతిగావించు ♦ తఱిని సుకృతి
హానిఁగనుచున్న వైరంబు ♦ నూనఁడెపుడు
నఱుకఁబడుచున్నఁ జందన ♦ తరువు దాను
బరిమళింపఁగఁజేయదే ♦ పరశుధార. 1

గీ. అద్భుతంబు మహాత్మమా ♦ హాత్మ్యమారఁ
కీడుమూఁడినయెడఁగూడఁ ♦ గెరలిమేలు
సేయుటరయంగనెటులన్నఁ ♦ దోయజారి
రాహునోటఁబడియుఁ బుణ్య ♦ రాసినొసఁగు. 2

గీ. పూజ్యజనులకుఁ బూజ్యులే ♦ పూజసేయు
చుందు రన్యులు పూజించు ♦ చుండ రెపుడు
ఈశుఁడిందునిశిరసావ ♦ హించుచుండ

గీ. గుణవిహీనులయెడఁగూడ ♦ ననుపమాన
మైన కృపతోడసజ్జను ♦ లలరుచుండ్రు
జగతి చండాలునింటను ♦ జందమామ
వెన్నెలనుఁగాయఁగా మాని ♦ వేసెనొక్కొ. 4

గీ॥ ఆదిమధ్యావసానంబు ♦ లందుమైత్రి
యుత్తమునకుండు నొకరీతి ♦ నుండదొరన
కలుగఁదీసిన కాచిన ♦ నతికిననుఁ బ
సిండి యన్యభావంబును ♦ జెందఁగలదె ? 5

గీ. తామెక్రోలవుతోయముల్ ♦ దటినులెల్ల
నారగింపవుపండ్లను ♦ భూరుహములు
మేయుచుండెనె సస్యముల్ ♦ మేఘవితతి
యుత్తమైశ్వర్యములగుఁ బ ♦ రోపకృతికి. 6

గీ. దుష్టశిష్టజనుల్ సూది ♦ తుదమొదళ్ల
ననుకరించుచునుండెద ♦ రరసిచూడ
నొకఁడురంధ్రమొనర్చు వే ♦ రొకఁడుదానిఁ
గప్పివేయుచుండును గుణ ♦ కలితుఁడగుచు. 7

గీ. ఖలవచోంగారవితతిచేఁ ♦ గాల్పఁబడుచు
నున్నఁబరుసములు వచింపఁ ♦ డుత్తముండు
తగులఁబడుచున్న నగ్నిచే ♦ నగురుతరువు
స్వీయసౌరభ్యముఁ బరిత్య ♦ జించునొక్కొ. 8

గీ. మాన్యులువిలాస్కైయన్న ♦ మాటయైన
శిలను వ్రాసినవర్ణమై ♦ చెలఁగుచుండు
మానహీనుల శపథంబు ♦ మాటయైన
నీటవ్రాసినవర్ణమై ♦ నిలుచుఁగాదె. 9

గీ. ధీరవర్యుఁడులేని పు ♦ దేశమందు
నల్పమతిమంతుఁడును స్తుత్యుఁ ♦ డగుచునుండు
భూరుహంబులు లేనట్టి ♦ భూమియందు
నాముదంపుమొక్కయును వృక్ష ♦ మానుగాదె. 10

## దుర్జననింద.

గీ. ఖలజనంబులకును గంట ♦ కంబులకును
బాదరక్షలచేముఖ ♦ భంగమైనఁ
దప్పులకుఁగొనిపోయి వ ♦ దలుటయైన
నిరుదెఱంగుల నేదేని ♦ జరుగవలయు. 11

గీ. మంచిమాటల నెన్ని వ ♦ చించుచున్నఁ
బరులదూఱక సంతోష ♦ పడఁడు దుష్టుఁ
డెన్ని రసములు భక్షించు ♦ చున్నఁ గాకి
తుష్టినందునె యమేధ్యావ ♦ స్తువునుఁదినక. 12

గీ. క్రూరమురగంబు ఖలుఁడు క్రూ ♦ రుండు పాము
కన్నను మిగులఁగ్రూరుఁడౌ ♦ ఖలజనుండు
భోగిమంత్రాన శాంతిని ♦ బొందుఁగాని
యెన్నఁడైనను లొంగునే ♦ యిలను ఖలుఁడు? 13

గీ. హీనజనపరిబాధిత ♦ మానసులకు
నుత్తమజనులయెడఁగూడ ♦ నుండుశంక
క్షీరదగ్ధముఖుండైన ♦ చిన్నవాఁడు
తక్రమునుఁగూడ నూఁదుచుఁ ♦ ద్రాగుఁగాదె 14

గీ. దుష్టజనుఁడొనరించు వి ♦ శిష్టతఁగన
నితరమానవోపద్రవ ♦ హేతువగును
పస్తుపడియున్న వ్యాఘ్రంపుఁ ♦ బారణంబు
బహుపశువినాశకరముగాఁ ♦ బరిణమించు. 15

గీ. ఇనకరోష్ణతఁగాలిన ♦ యిసుకయెట్లు
కాల్చునోయట్లు సూర్యుండు ♦ కాఁపఁజాల
డన్యపరిలబ్ధపదుఁడైన ♦ యల్పజనుఁడు
దుస్సహంబౌచుఁ దఱుచుగాఁ ♦ దోఁచుచుండు. 16

గీ. గొట్టమునఁబెట్టికట్టినఁ ♦ గుక్కతోఁక
కాదు సరళంబు వక్రంబు ♦ గానెయుండు.
నట్లె బోధితంబయ్యును ♦ నల్పమనము
సాధుధర్మంబునొందంగఁ ♦ జాలదెపుడు. 17

గీ. నిర్మలజలంబుచేఁ జెఱ్వు ♦ నిండియున్నఁ
గుండలోనినీటినె కాకి ♦ గ్రోలుచుండు
నుచితగుణవతియైభార్య ♦ యొప్పుచున్న
నీచుఁ డన్యకాంతాలోల్యుఁ ♦ డౌచునుండు, 18

గీ. సాహ్వాదంబును బ్రీతియుఁ ♦ జనదుచేయ
చెనఁటి మానిసితోఁ జేయఁ ♦ జెఱుపుగల్గు
కాలియుండినబొగ్గు ♦ గాల్పఁజేయుఁ
జలువఁజెందినయెడనైన ♦ నలుపుఁజేయు. 19

గీ. ప్రాణములవీడియైనను ♦ బరజనహిత
కార్యభంగంబొనర్చును ♦ ఖలజనుండు
కబళపతితమై మక్షిక ♦ గ్రాసకరుని
మించి వెంటనేవాంతిఁజే ♦ యించుఁగాదె. 20

గీ. పరులదూరెడు వేళలఁ ♦ బంక్తినదనుఁ
డన్యదోషంబులనరయు ♦ నట్టితఱిని
వేయికన్నులుగలయట్టి ♦ వేల్పు సేచుఁ
డార్యధనహ్రాతిఁ గార్తవీ ♦ ర్యార్జనుండు. 21

గీ. ఖలజనుండొనరించు దు ♦ ష్కార్యఫలము
సాధుజనులకుఁగూడను ♦ సంక్రమించు
దశముఖుండు ధరాత్మజఁ ♦ దస్కరింప
శరధిబంధితమయ్యె దా ♦ శరధిచేత. 22

గీ. మంచిమాటలనెన్ని బో ♦ ధించుచున్న
ఖలుఁడు సజ్జనుఁడెన్నండుఁ ♦ గాఁడుభువిని
పెక్కునదులస్నానంబుఁ గా ♦ వింపఖరము
హాయముగామాఱునే యెన్నఁ ♦ డైనఁగాని. 23

గీ. ఉరుయశస్సురభికినిఁ ♦ నుల్లిపాయ
శాంతిశైత్యంబునకుహుతా ♦ శనుఁడుతలఁప
ననుపమదయాసుమంబున ♦ కాకసంబు
ఖలుఁడు సాధుజనాళిదుః ♦ ఖప్రదుండు. 24



విద్వత్ప్రశంస.

గీ. బుధజనపరిశ్రమంబు వి ♦ బుధుఁడెఱుంగుఁ
గాని షండయెటులనెఱుఁ ♦ గంగఁజాలు
ప్రసవదుఃఖంబు సంతాన ♦ వతియెఱుంగు
నిలను గొడ్రాలికివ్యధ ♦ యేమితెలియు. 25

గీ. మానవేశ్వర విబుధ ధ ♦ ర్మంబులెపుడు
సదృశములుగావు పండిత ♦ సార్వభౌముఁ
డన్నియెడలనుఁబూజ్యుఁడై ♦ యలరుచుండు
పూజ్యుఁడౌ స్వదేశంబున ♦ భూవరుండు. 26

గీ. శశధరవిషంబులనుఁ ద్రిలో ♦ చనుఁడుఁబోలె
సుగుణదోషంబులగ్రహించి ♦ సూరిజనుఁడు
మొదటిదానిని శ్లాఘించు ♦ మూర్ధమునను
కంఠస్థలమునందిడుకొను ♦ గడమదాని. 27

గీ. మూర్ఖులిభతురంగము లెక్కి ♦ పోవుచుండ్రి
పదగతుండగు నిర్ధన ♦ పండితుండు
గ్రావశిఖరాననున్ననుఁ ♦ గాకిమూఁక
పులినగతరాజహంసలఁ ♦ బోలఁగలదె? 28

## మూర్ఖుఁడు.

గీ. ఏనికిసహజమౌప్రజ్ఞ ♦ హీనమగునో
యాతనికి నాగమంబేమి ♦ సార్థకంబు
లోచనయుగంబెవనికి వి ♦ లోపమగునో
యద్దమాజనునకునేమి ♦ సార్థకంబు. 29

గీ. మృగఖగాలకు ముత్యాలు ♦ మేలుబువ్వ
ఖరమునకు నంధునకు దీప ♦ కళిక చెవిటి
వానికింపైన గానంబు ♦ పామరునకు
నిద్ధ ధర్మప్రసంగంబు ♦ నేమిఫలము. 30

## ధనవంతుఁడు, ధనము.

గీ. పవనకంపితదీపిక ♦ పగిదిఁలక్ష్మి
చంచలముగాని మీకు శా ♦ శ్వతముకాదు
కాన ననుభవింపుఁడు స్వే ♦ చ్ఛగానొసంగుఁ
డార్యులను గౌరవింపుఁడ ♦ త్యంతభక్తి. 31

గీ. ప్రాణరహితంబు దుందుభి ♦ యయ్యునద్ది
యార్చుచుండెధనం ధన ♦ మ్మనుచు నింకఁ
ప్రాణములతోడనుండిన ♦ మానవుండు
ధనముఁగోరుట నేమి చి ♦ త్రంబుగలదు ? 32

గీ. ప్రాయమున వృద్ధులైనట్టి ♦ వారుగలరు
జ్ఞానమున వృద్ధులగువారు ♦ చాలఁగలరు
తపముచేఁ బెద్దలుగలరు ♦ ధరణి వీరు
ధనముచే వృద్ధులగువారి ♦ దాసులరయ. 33

గీ. ధాత్రి నెవనికివిస్తార ♦ ధనముగలదొ
బ్రహ్మహత్యయొనర్చిన ♦ వాఁడుపూజ్యుఁ
డగును నెవ్వఁడు నిర్ధనుం ♦ డగునొ యూతఁ
డమలవంశ్యుఁడైననుఁ బఱి ♦ త్యాజ్యుఁడగును. 34

గీ. కనకమహిమంబువచియింపఁ ♦ గానుశక్తి
యెవ్వనికినైన నున్నదే ♦ యెంతవింతొ
నామసామ్యంబుచేతను ♦ నరులకెల్ల
మత్తతనొసంగుచుండెను ♦ మ్మెత్తచెట్టు. 35

గీ. కామినీధనంబులయెడఁ ♦ గాంక్షమాన
వాళికి సృజించెవాగ్వని ♦ తాధిపుండు
వానియెడఁగల కాంక్ష నె ♦ వ్వండువదలు
వాఁడు మానుషాకృతినొప్పు ♦ భర్గుఁడరయ. 36

గీ. చెవులు శబ్దంబువినకుండఁ ♦ జేయుచుండు
నోటమాటాడనీయదు ♦ గాటమైన
వికృతిఁగలిగించుమేనికి ♦ వీక్షణంబు
మాన్పసంపదయనెడు నా ♦ మంబుమహిని. 37

## తేజోవంతుడు.

గీ. దానధారావిలకపోల ♦ దంతివితతి
పైకిలంఘించుఁ గంఠీర ♦ వంపునిసుఁగు
సత్వవంతులకియ్యది ♦ సహజమరయ
సత్వమునకుఁ బ్రాయంబుబీ ♦ జంబుగాదు. 38

గీ. ఇనశశాంకులొనర్చిన ♦ యొగ్గుతుల్య
మైన సైహికేయుఁడు ♦ భానునాలసించి
మ్రింగు జాగుసేయక చంద్రు ♦ మ్రింగుచుండఁ
దప్పకుండఁ గనదిమ్మృఁడు ♦ త్వంపుఫలము. 39

ఉదారుఁడు.

గీ. ఒకనిచేఁజేయిక్రిందుగా ♦ నుంపఁబడును
నింకొకనిచేయి మీఁదుగా ♦ నెత్తఁబడును
దాతృ యాచకలోక భే ♦ దంబుభువిని
హస్తములచేత సూచిత ♦ మగుచునుండె. 40

గీ. ఏదిశిష్టజనాళికి ♦ నిచ్చుచుంటొ
దేనిఁ బ్రతిదినంబును నీవు ♦ తినుచునుంటొ
యదియ తావకవిత్తమా ♦ నని తలంతుఁ
దక్కు ద్రవ్యమెవ్వానికో ♦ దాచుచుంటి 41

గీ. ఇనతనూజుండు చర్మంబు ♦ నిచ్చివేసె
శిబియు నాత్మీయమాంసముం ♦ జెలఁగియొసఁగె
మునివరుండు దధీచియె ♦ మ్ములనొసంగె
నీయరానిది దాతల ♦ కేదిగలదు? 42

గీ. అల్పుఁడైనను దాతసే ♦ వార్హుఁడగును
గొప్పవాఁడైన నిష్ఫలి ♦ గొల్వఁదగఁడు
జలమపేక్షించు నాతఁడు ♦ జలధివిడిచి
క్షోణిసంధువుసేవించు ♦ చుండఁడేఁజూడు. 43

## ధీరప్రశంస.

గీ. నీతిమంతులు నిందింప ♦ నిండు పొగడ
నిండు లక్ష్మిరానిండు పో ♦ నిండు చావు
నపుడెకానిండు మఱియొక ♦ యపుడెయనుఁడు
పదముకదుపరుజ్ఞులు న్యాయ ♦ పథమునుండి. 44

## గుణప్రశంస.

గీ. సద్గుణంబుల సర్వజ్ఞ ♦ సామ్యుఁడైన
నాశ్రయములేమి మానవుఁ ♦ డందుఁజింత
నవనిమానికము నమూల్య ♦ మైనదైనఁ
గాంచనసమాశ్రయ మపే ♦ క్షించుఁగాదె. 45

గీ. గుణిగుణజ్ఞుండుగనుఁగొని ♦ కుతుకమందు
గుణవిహీనుండు గుణియెడఁ ♦ గనఁడుముదము
వనజమునుఁబొందు వనినుండి ♦ వచ్చితేఁటి
సవిధవర్తియైనఁ గనద ♦ బ్జమునుఁ గప్ప. 46

గీ. గుణవిభూషులు దఱుచుగాఁ ♦ గోడుఁగండ్రు
సుగుణదూరుండుగాంచును ♦ సుఖము నెప్డు
బంధితములయ్యె శుకములు ♦ పంజరముల
కాకములు స్వేచ్ఛగాఁదిరు ♦ గాడుచుండె 47

గీ. గుణగణంబున నుచ్ఛ్రిత ♦ మనుజుఁడొందు
నున్నతాసనస్థితుఁడౌట ♦ నొందలేఁడు
రుచిర సౌధాగ్రమందుఁగూ ♦ ర్చుండియున్న
కాఁకి వైనతేయంబు కాఁ ♦ గలదెభువిని. 48

గీ. సద్గుణములకై యత్నంబు ♦ సలుపవలయు
డంబములచేతనుఁ బ్రయోజ ♦ నంబులేదు
క్షీరరసహీనమైనట్టి ♦ సౌరభేయి
విక్రయంబౌనె ఘంటికా ♦ వితతిచేత. 49

## మిత్రము.

గీ. చాటునందునఁ గార్యనా ♦ శంబుఁజేసి
యెదుటఁబ్రియము వచించున్నె ♦ హితుఁడెవండొ
వానిక్షీరముఖవిషకుం ♦ భంబుపగిదిఁ
జేరనీయరాదు పరిత్య ♦ జింపవలయు. 50

గీ. మానవులకుసహజసిద్ధుఁ ♦ డైనసఖుని
యెడలనెట్టివిశ్వాసంబు ♦ హృదినిఁగలదొ
యట్టినమ్మిక మాతృదా ♦ రాత్మజాత
సోదరులయందుఁగూడను ♦ లేదుతలఁప. 51

## దారిద్ర్యము.

గీ. మృత్యుదారిద్ర్యములమృత్యు ♦ వేరుచించుఁ
గాని దారిద్ర్యమెప్పుడు ♦ కాదుమతము
చావు పరికింపనల్పక ♦ ష్టప్రదంబు
దైన్యమంతంబుదాఁక బా ♦ ధాకరంబు. 52

గీ. అన్యజనుఁడునుఁ దనవాఁడె ♦ యగునుధనికి
దైన్యభావంబుచేఁ బరి ♦ తాపపడెడు
వానికత్యంతసామీప్య ♦ బంధులైన
దవ్వులనెయుందురీ ధారుణీ ♦ తలమునందు. 53

గీ. భాగ్యహీనత ? నీకెడ ♦ వందనంబు
త్వత్ప్రసాదంబుచే నేను ♦ ధన్యతముఁడ
జనులనెందఱినో నేను ♦ గనుచునుంటి
గాని యొక్కఁడైనను నన్నుఁ ♦ గాంచలేదు. 54

గీ. తృణముకంటెనుఁ దూలంబు ♦ తేలికగును
దానికంటెనుఁ దేలిక ♦ తలఁపనర్థి
గాలి యీతనిఁగొనిపోవ ♦ దేలయనిన
మించి యీతఁడు తన్ను యా ♦ చించుననుచు. 55

గీ. కాకి కాకులఁబిల్చును ♦ గాని యర్థి
యర్థులనుఁబిల్వఁ దలఁకఁడు ♦ స్వార్థుఁడౌటఁ
గాక యాచకజనులఁ గా ♦ కంటె శ్రేష్ఠ
మగును మంచియీతండు కాఁ ♦ డర్థిజనుఁడు. 56

గీ. ఎంతదనుక యాచింపరో ♦ యంతవఱకె
ఘనతకలవారికుండును ♦ గౌరవంబు
బలిని యాచించుసమయాన ♦ జలధికన్య
కాధిపుండును వామనుం ♦ డయ్యెఁగాదె. 57

గీ. ఇమ్మనెడు పల్కునాలించి ♦ యెడఁదయందు
వాసమొనరించుచుండు శ్రీ ♦ హ్రీ, ధృతి, మతి,
కీర్తి, లక్ష్ములనెడు దేవతల్ ♦ క్షిప్రగతిని
ఆననమునుండి వెలువడి ♦ చనుచునుండు. 58

గీ. యాచనాక్షరములతోడ ♦ నర్థిజనుని
యాననమునుండి ప్రాణంబు ♦ లరుగుచుండు
ఇచ్చుచున్నాననుచు దాత ♦ యుచ్చరించు
వర్ణములతోడఁ బ్రాణముల్ ♦ వచ్చుఁదిరుగ. 59

గీ. మానధనమంతఁగోల్పోయి ♦ మానవుండు
పరునిదరిఁజేరి కేల్చాపి ♦ యుక్కుదక్కి
దేహియనియడుగుటకంటెఁ ♦ దీక్ష్ణమైన
కత్తి నాల్కఁగోసికొనుట ♦ యుత్తమంబు. 60

గీ. జనుము జనుమనియాశ ముం ♦ దునకు గెంటు
వెళ్లవలదనిసిబ్బితి ♦ వెనుకలాగు
నాశకును లజ్జకును మధ్య ♦ నర్థిహృదయ
ముయ్యాలెటులూఁగునో యట్లు ♦ లూఁగుచుండు. 61

## కృపణుఁడు.

గీ. లోభిజననిభుండగుదాత ♦ లోకమందు
ముందుపుట్టఁడు వెన్కను ♦ బుట్టలేదు
తనధనంబులనెల్ల హ ♦ స్తములతోడ
ముట్టకుండనె పరులకు ♦ ముట్టఁజెప్పె. 62

గీ. ఆత్మసౌఖ్యవినాశంబు ♦ నాచరించు
కొనుచువిత్తంబునెవ్వఁడు ♦ కూడఁబెట్టు
నెంచుచుండెనో యాతండు ♦ నితరభార
వహునిబోలె కష్టమునకె ♦ పాత్రుఁడగును. 63

గీ. విభవముండియు నొరులకుఁ ♦ బెట్టకుండఁ
దాను దినకుండ నెవ్వాఁడు ♦ ధాత్రిఁగలఁడొ
చెందదాతని కాసొమ్ము ♦ జేనుఁబరుల
కైగదా కాయుచుండెను ♦ గడ్డిబొమ్మ. 64

గీ. వలసినంతధనంబు సం ♦ ప్రాప్తమైన
లుబ్ధత ననుభవింపఁడు ♦ లోభిజనుఁడు
గొంతుదనుకను జలమున్న ♦ కుర్కురంబు
రసనతోఁగాదె నీళ్లనుఁ ♦ ద్రాఁగుచుండు. 65

గీ. దేహియనియడుగఁదలఁచు ♦ దేహికెట్టి
చింతమొదఁగల్గునోయట్టి ♦ చింతదాత
యెఱిఁగియేయుండినయెడ న ♦ ద్దేమియనక
యాత్మదేహంపుఁ బిశునంబు ♦ లైననొసఁగు. 66

గీ. విభవయుక్తుఁడైన ననుభ ♦ వింపఁదగును
నొసఁగదగుఁగాని యార్జించి ♦ యుంచఁదగదు
మధుకరసమార్జితంబైన ♦ మధువదెల్ల
నన్యజనగృహీతంబౌట ♦ నరయలేదె. 67

## తృష్ణ.

గీ. ఆశకెవ్వాఁడుదాసుఁడొ ♦ యాతఁడఖిల
లోకమునకుఁ గింకరుఁడౌచు ♦ లొంగియుండు
నాశ యేమహాత్మునకు ♦ దాసియగునొ
యతని కఖిలలోకంబు దా ♦ స్యంబుసేయు. 68

గీ. చ్యుతములయ్యెను దంతముల్ ♦ సితములయ్యెఁ
గేశముల్ దృష్టిలోపించె ♦ నీశరీర
మరుగసిద్ధమయ్యెనుగాని ♦ యాశయనెడు
సాధ్వి నన్నువీడఁగను వి ♦ చారమందు. 69

గీ. యౌవనమువృద్ధతాక్రాంత ♦ మౌచునుండు
వ్యాధిసంహృతమారోగ్య ♦ మరసిచూడ
జీవితంబంతయు జావు ♦ చేతఁబడను
హానిలేకుండనున్నది ♦ యాశయొకటి. 70

గీ. అదిగొప్పది. గిరికంటె ♦ నబ్ధిఘనము
అబ్ధికంటెను వ్యోమంబు ♦ నధికతరము
వ్యోమమునకంటె బ్రహ్మంబు ♦ నురుతరంబు
దానికంటెనుగొప్పది ♦ తలఁపనాశ. 71

## దైవము.

గీ. అబ్ధిమథియించుసమయంబు ♦ నందులక్ష్మి
నొందెవిష్ణుండు. శంకరుఁ ♦ డొందెవిషముఁ
గాన దైవంబెఫలియించుఁ ♦ గాని పౌరు
షంబు విద్యయు ఫలియింపఁ ♦ జాలవెప్పుడు. 72

గీ. రక్షణవిహీనుఁడగు దైవ ♦ రక్షితుండు
క్షితినిరక్షితుండును దైవ ♦ హతుఁడుకాఁడె
అనదయయ్యును జీవించు ♦ నడవినైన
నెంతకాపాడిననుఁ జచ్చు ♦ నింటనొకఁడు. 73

## ఉద్యోగము.

గీ. యత్న మొనరింపవలయుఁ గా ♦ ర్యంబుకొఱకు
ఫలము మార్జారమునకును ♦ వలెనె యగును.
పుట్టుకాదిగఁ బిల్లికి ♦ మొదవు లేదు
ప్రతిదినంబును నయ్యది ♦ పాలఁ ద్రాఁగు. 74

గీ. యత్న మొనరింప కార్యంబు ♦ లగును గాని
కోరికల చేతఁ జేత లీ ♦ డేఱ వెపుడు
నిద్రబోవుచుండిన మృగ ♦ నేత నోట
మృగగణంబులు పడుచుండు ♦ నే తలంప. 75

## సత్సంగతి.

గీ. సాధుసంసర్గ సంసర్గ ♦ శక్తిచేతఁ
జేయఁగా రానిక్రియ లైనఁ ♦ జేయుఁ ఖలుఁడు
చీమ విరిఁ జేరి భూతేశు ♦ శిరము నెక్కి
కువలయాప్తుని ముద్దిడు ♦ కొనుచునుండె. 76

గీ. పుష్పసంపర్కమునుఁ గాంచి ♦ పురువుకూడ
శిష్టజనమస్తకం బధి ♦ ష్ఠించుచుండె
మాన్యసంస్థాపితమయి య ♦ శ్మంబుగూడ
మించి దేవతాత్వంబునుఁ ♦ గాంచుచుండె. 77

గీ. యత్న మొనరించు మానవు ♦ హస్త మెంతొ
సంతసంబున గ్రహియించు ♦ జలధికన్య
యత్నరహితుఁడై యుండిన ♦ యట్టివాని
చేయి గ్రహియించుఁ దప్పక ♦ జ్యేష్ఠలక్ష్మి. 78

గీ. సాధుజనుతోడఁ జేసిన ♦ సావ్యాదంబు
నెవ్వనికి గౌరవాధిక్య ♦ మీయకుండు ?
రాజమార్గానఁబోరలు నీ ♦ రంబుగంగ
నొంది దేవపూజితమగు ♦ చుండెఁగాదె. 79

## స్థానబలము.

గీ. స్వస్థలమునొంది యిభసార్వ ♦ భౌముడైనఁ
గ్రిచ్చఁబగ్రిహించుచుండె న ♦ క్రింబునదియె
యాత్మ పదపరిభ్రష్టత ♦ నందెనేని
కుక్క చేతనుఁ గూడను ♦ చిక్కుఁగాదె. 80

గీ. అనువుకానట్టియెడనున్న ♦ నధికుఁడైన
పీడఁదప్పక గనుచుండుఁ ♦ బృథివియందు
లోహసంస్థితుఁడగు నన ♦ లుండుగూడ
కారుకునిసుత్తిపెట్టులఁ ♦ గాంచుచుండె. 81

గీ. ఆశ్రియవశంబుచేఁ గాదె ♦ యఖిలజనులు
గౌరవాగౌరవంబులఁ ♦ గాంచుచుండ్రి
వింధ్యగిరినున్నగజములు ♦ వింధ్యతోడ
నుద్దిరుగుచుండుఁ గొద్దివౌ ♦ నద్దమందు. 82

గీ. అశ్వ, మస్త్రంబు, శాస్త్రంబు ♦ నతివ, వీణె
వాక్కు, మనుజుండు, వీరలు ♦ ప్రాప్తపురుష
గుణవిభేదంబునను దామఁ ♦ గూడ సతము
యోగ్యతాయోగ్యతలచేత ♦ నొప్పుచుండ్రి. 83

### పశ్చాత్తాపము.

గీ. విత్తవంతుండనని నాకు ♦ వీఁకగలదు
చెడెను ధనమిఁక నేమని ♦ చింతఁగనుదు
పడుట లేచుటల్ నరులకుఁ ♦ బుడమిలోన
హస్తనిహితకందుకముల ♦ ననుకరించు. 84

### క్షమ.

గీ. రూపమగునరులకు నగ ♦ రూపమునకు
గుణము భూషణంబగుచుండు ♦ గుణమునకును
జ్ఞానమసదృశంబగు విభూ ♦ షణముచూడ
జ్ఞానమున కలంకారము ♦ క్షమయెకాదె. 85

### క్షుధ.

గీ. క్షుధకు నెనయగురోగంబుఁ ♦ జూడలేదు
క్షుధకుఁ బ్రతివచ్చుదుఃఖంబుఁ ♦ జూడలేదు
భుక్తినిభమగుసౌఖ్యంబు ♦ భువినిలేదు
రోషమున కుద్దియగు వైరి ♦ రోయలేదు. 86

### జీవితసాఫల్యము.

గీ. మృదుమధురవాగ్విశిష్టుఁడై ♦ యెవఁడు కలఁడొ
పుత్రిసాధ్వీతములుగల ♦ బోఁటిమగఁడె
వంశో ధనియుదాతయునై యె ♦ వండుకలఁడొ
వానిజన్మంబుసార్థకం ♦ బౌనుగాదె. 87

## పరోపకృతి.

గీ. ఒకరికుపకృతిఁగావింప ♦ కుందు నెవ్వఁ
డట్టి యతని జన్మంబు నిం ♦ ద్యంబు కాదె
కసవుభక్షించుచుండును ♦ బసులత్వచము
కూడ మేలు సేయుచునుండె ♦ క్షోణిఁబ్రజకు 88

## సత్పుత్రప్రశంస.

గీ. పాలనీయనిదియు గర్భ ♦ వతియుఁగాని
యూలవలనమనకు నేమి ♦ మేలుకలదు
పండితుండును మఱిధార్మి ♦ కుండుఁగాని
యట్టితనయువలన చరి ♦ తార్థమేమి. 89

గీ. ప్రజ్ఞచేతను ధనముచే ♦ బలముచేత
నెవఁడు వంశభారంబు వ ♦ హించుచుండె
నట్టి యాతనిఁగాంచిన ♦ యట్టితల్లి
పుత్రవతియని పొగడొందుఁ ♦ బుడమియందు. 90

## మృతప్రాయులు.

గీ. పేద, మూర్ఖుండు, నామయ ♦ పీడితుండు,
నన్యదేశస్థుఁడుఁ సేవి ♦ యైదుగురును
బ్రతికియుండియుఁ జచ్చిన ♦ వారటంచు
వ్యాసమౌనివరుఁడు మున్ను ♦ పల్కియుండె. 91

## మిశ్రమప్రకరణము.

గీ. పగతుఁడు వచింపనేది దు ♦ ర్వచనమగునొ
యదియె సైదోడనినఁ బరి ♦ హాసమగును
నిలఁబరేంధనములఁబుట్ట ♦ నేదిధూమ
మగునొ యదియ గురునధూప ♦ మగునుఁగాదె. 92

గీ. వనములదహించుచుండిన ♦ పావకునకు
మిగులనేస్తకాఁడగుఁగాదె ♦ మిన్నుమాలి
యతఁడు వెల్గుచుండినదీప ♦ మార్పివేయుఁ
గాన దుర్బలుర చెలిమిఁ ♦ గనఁడెవండు. 93

గీ. తిన్ననైనట్టిమార్గానఁ ♦ దిరుగుచున్న
జంతుసంతానములుకూడ ♦ సాయపడును
న్యాయమార్గంబువిడనాడి ♦ నడచువానిఁ
దోడఁబుట్టినవాఁడైన ♦ వీడుఁగాదె. 94

గీ. కొద్దివారైయున్ననుఁ దమ ♦ కొలమువారి
నంటియుండుటచాల శ్రే ♦ యస్కరంబు
ఊఁకతోడ విడువఁబడు ♦ చున్ననైనఁ
దండులంబులు మొలచునే ♦ ధరణియందు. 95

గీ. జలధిఁగురిసినవర్షంబు ♦ చందమునను
భుక్తిఁజేసినవానికి ♦ భుక్తిరీతి
సంప్రజనునకుఁజేసిన ♦ యట్టిమేలు
నిరుపయోగంబగునుఁగాదె ♦ ధరణియందు. 96

గీ. సదుపదేశంబుచే మౌర్ఖ్య ♦ మెదుగు మూర్ఖ
జనునకంతమెన్నండు కాఁ ♦ జాలదరయ
నాగవితతికి క్షీరపా ♦ నంబుచేత
నంతరింపదు వృద్ధియే ♦ యగువిషంబు. 97

గీ. కలశపాథోధిమథియించు ♦ కాలమందు
సుజన కుజనులు పుట్టుట ♦ నిజమెయగును
నొకఁడు చంద్రసహోదరు ♦ డొకనొకండు
హాలహాలమున కనుజాతుఁ ♦ డరసిచూడ. 98

గీ. చేయఁగూడనిచేతలఁ ♦ జేయుచుంట
బంధువైరంబు బలితోడ ♦ స్పర్థసతుల
నమ్మియుండుటయనెడు నీ ♦ నాల్గుమృత్యు
వునకు ద్వారంబులగుచుండుఁ ♦ బుడమియందు. 99

గీ. అన్యుఁడైన హితుఁడు బంధుఁ ♦ డగుచునుండు
బంధుఁడహితుఁడైయుండినఁ ♦ బరుఁడెయగును
వ్యాధిమేనజనించియు ♦ నహితమగును
నహితమౌనె వన్యంబైన ♦ నౌషధంబు. 100

గీ. విప్రుఁ, డగ్ని, యముండు, పృ ♦ థ్వీధవుండు
జలధి, మందిర, ముదర మీ ♦ సప్తకంబు
వివిధవిధులనుఁబూర్తిఁగా ♦ వించుచున్నఁ
బూర్తినొందక తొంటిచొ ♦ ప్పునెయుండు. 101

Sree Savitri Press, Cocanada.